## మంగళాచరణము

౧.మంగళాచరణమనగా యేమిటి? ౨.మంగళాచరణ విషయంలో ప్రమాణమేమిటి? 3.మంగళము ఎన్ని విధములు? ౪.గ్రంథారంభమున మంగళాచరణము ఎందుకు చేయాలి? ౫.మంగళాచరణముయొక్క ప్రయోజ నమేమిటి?

సమాధానము:---౧.మంగళాచరణముయొక్క లక్షణము---"సమాప్తిప్రతిబంధకీభూతవిఘ్న (దురిత) విశేష విఘాతకత్వం మంగళత్వమ్". గ్రంథముయొక్కగాని ఏదేని కార్యముయొక్కగాని సమాప్తియందు తటస్థపడు ప్రతిబంధకములను విశేషముగా ధ్వంసముజేయునది మంగళమనబడును. లేదా"విఘ్నధ్వంసమునకు అను కూల వ్యాపారమునకు మంగళ"మందురు.విఘ్నమనగా గ్రంథసమాప్తియందు ప్రతిబంధకరూప పాపము. దాని యొక్క ధ్వంసమునందు(నాశమునందు) అనగా నివృత్తియందు అనుకూలమగు అనగా ఉపయుక్తమగు వ్యాపారము అనగా మనోవాక్కాయముల క్రియావిశేషము--అది మంగళమనబడును.

కొందరు గ్రంథకర్తలు మంగళముయొక్క పరిష్కృత లక్షణము ఈక్రింది విధముగా చేసియున్నారు.

"విఘ్నభిన్నత్వేసతి విఘ్నధ్వంసప్రతిబన్ధకాభావభిన్నత్వేసతి ప్రారిప్సితవిఘ్నధ్వంసాఽసాదారణకారణం మంగళమ్"। విఘ్నములకంటె భిన్నమై, విఘ్నధ్వంసముయొక్క ప్రతిబన్ధక అభావముకంటె భిన్నమై, ప్రారిప్సిత =ప్రారంభించాలి--అను ఇచ్ఛకు విషయభూతమగు కార్యముయొక్క విఘ్నధ్వంసమునకు అసాధారణ కారణ మేదియో, అది మంగళమనబడును.

ఇక్కడ, 'మంగళమ'నునది విఘ్నములకంటె భిన్నమై యున్నది. విఘ్నధ్వంసరూప కార్యమునకు జనకమ గు యే ప్రతిబన్ధక అభావము గలదో, దానికంటెగూడ భిన్నమై యున్నది. అట్లే ప్రారంభించాలను ఇచ్ఛకు విష యభూతమగు యే గ్రంథము గలదో, దానికి ప్రతిబన్ధకములగు విఘ్నములయొక్క ధ్వంసమునకు అసాధార ణ కారణమై యున్నది.

ఉక్త లక్షణ పరీక్ష:--- 'విఘ్నభిన్నత్వేసతి' అను ఇంత భాగమును లక్షణమునందు నివేశింపనియెడల విఘ్నములయందు అతివ్యాప్తి దోషము ప్రసక్తమగును. ఎందుకంటే, ఆ విఘ్నములు విఘ్నధ్వంసమునకు జన కమగు ప్రతిబన్ధకాభావముకంటె భిన్నములును మరియు ప్రారిప్సిత గ్రంథ సమాప్తికి ప్రతిబన్ధకములగు విఘ్న ములయొక్క ధ్వంసమునందు అసాధారణ కారణములుగూడ ఉన్నవి. ఉదా:---ఘటధ్వంసమునకు ముద్గర(రో కలి) ప్రహారము(దెబ్బ)మొదలగునవి అసాధారణ కారణములుండును. అట్లే, ఘటరూప ప్రతియోగిగూడ స్వ ధ్వంసమునందు అసాధారణ కారణముండును. అట్లే, విఘ్నములయొక్క ధ్వంసమునందు విఘ్నరూప ప్రతి యోగిగూడ అసాధారణ కారణమగును. అందువలన, ఆ విఘ్నములందు ప్రసక్తమగు అతివ్యాప్తి నివారణార్థ ము ఉక్త లక్షణములో 'విఘ్నభిన్నత్వేసతి' అను ప్రథమ సత్యన్త విశేషణము ఇవ్వబడినది.

అదే విధముగా ఉక్త లక్షణములో 'విఘ్నధ్వంసప్రతిబన్ధకాభావభిన్నత్వేసతి'అను ఇంత భాగమును చెప్ప నియెడల ఆ 'విఘ్నధ్వంసప్రతిబన్ధకాభావము'నందు అతివ్యాప్తి కలుగును. ఎందుకనగా, ప్రతిబన్ధకము విద్య మానమున్నచో ఏ కార్యమును ఉత్పన్నము కాజాలదు. ఈ కారణముచే ఆ విఘ్నధ్వంసముయొక్క ఉత్పత్తి యందు ప్రతిబన్ధకాభావము కారణమగును. చేయునది 'మంగళము'యొక్క లక్షణము. కావున, విఘ్నధ్వంస ప్రతిబన్ధకాభావమునందు అతివ్యాప్తి నివృత్త్యర్థము ఉక్త లక్షణములో 'విఘ్నధ్వంసప్రతిబన్ధకాభావభిన్నత్వేస తి' అను ద్వితీయ సత్యన్త విశేషణము ఇవ్వబడినది.

ఒకవేళ లక్షణమునందు 'ప్రారిప్సిత' పదము చేర్చనిచో 'కారీరి'యాగమందు లక్షణముయొక్క అతి వ్యాప్తి కలుగును. ఎందుకంటే, ఆ 'కారీరి'యాగము విఘ్నములకంటె భిన్నమున్నది, విఘ్నధ్వంసప్రతిబన్ధకాభా వముకంటెను భిన్నమున్నది. అట్లే వృష్టికి(వర్షమునకు)ప్రతిబన్ధకములగు యే విఘ్నములుగలవో, వాటి ధ్వంస మునకు అసాధారణ కారణముగూడ ఉన్నది. కాని, ఇక్కడ ప్రారిప్సిత(ప్రారంభించాలి--అను ఇచ్ఛకు విషయ) ము మంగళమున్నది, యాగము కాదు. కావున, 'ప్రారిప్సిత' పదనివేశముచే 'కారీరి'యాగమందు అతివ్యాప్తి నివర్తించును.

ఇప్పుడు ఒకవేళ ఉక్త లక్షణమందు 'అసాధారణ' పదము చెప్పనియెడల 1.ఈశ్వరుడు, 2.ఈశ్వరుని జ్ఞానము, 3.ఈశ్వరుని ఇచ్ఛ, 4.ఈశ్వరుని ప్రయత్నము, 5.దేశము, 6.కాలము, 7.అదృష్టము, 8.ప్రాగభావము, 9.ప్రతిబన్ధకాభావము---అను నవసాధారణ కారణములలో అతివ్యాప్తి ప్రసక్తమగును. తన్నివారణార్థము 'అసా ధారణ' పదము ఇవ్వబడినది.

౨.శంక:---మంగళాచరణ విషయంలో ప్రత్యక్షప్రమాణమేమియు లేదు. ఎందుకంటే, 'కిరణావళి' మొదలగు నాస్తిక గ్రంథములలో మంగళాచరణము చేయబడకున్నను నిర్విఘ్నముగా సమాప్తి కనబడుచున్నది. బాణభ ట్టుయొక్క 'కాదంబరి' మొదలగు ఆస్తిక గ్రంథములలో మంగళాచరణము చేయబడినప్పటికిని సమాప్తి కాజాలకుండెను. ఈ ప్రకారము అన్వయ-వ్యతిరేకముల యొక్క వ్యభిచారమున్నందున మంగళమునందు నిర్విఘ్న- పరిసమాప్తికి కారణత్వము ప్రత్యక్ష ప్రమాణముచే అవగతమగుట లేదు.

అన్వయ-వ్యతిరేక సహచార జ్ఞానముచే కార్యకారణభావము నిశ్చయమగును. 1.అన్వయ సహచా ర జ్ఞానము--"కారణసత్త్వే కార్యసత్త్వం అన్వయసహచారః" కారణముంటే కార్యోత్పత్తియగును. ఎట్లనగా, మృ త్తికా-కులాలాది కారణములున్నప్పుడే ఘటరూప కార్యోత్పత్తియగును. 2.వ్యతిరేక సహచార జ్ఞానము-- "కార ణాభావే కార్యాభావో వ్యతిరేకసహచారః" కారణము లేకుంటే కార్యోత్పత్తి కాదు. ఎట్లనగా, మృత్తికా-కులాలాది కారణములు లేకుంటే ఘటరూప కార్యోత్పత్తి కాదు. ఈ రెండును(అన్వయ-వ్యతిరేక సహచారజ్ఞానములు) ఇచ్చట లేవు. ప్రత్యుత (అట్లుకాకుండగా) అన్వయ-వ్యతిరేక వ్యభిచార జ్ఞానములు గలవు. ఎట్లనగా, 1."కార ణసత్త్వే కార్యాభావః=అన్వయవ్యభిచారః" 'కాదంబర్యా'దులలో కారణము విద్యమానమైయున్నప్పటికిని కార్యో త్పత్తి (నిర్విఘ్న-పరిసమాప్తి) గాకున్నది. 2."కారణాభావే కార్యసత్త్వం వ్యతిరేకవ్యభిచారః" 'కిరణావళ్యా'దులలో కారణము(మంగళము)లేకున్నను కార్యోత్పత్తి(నిర్విఘ్న-పరిసమాప్తి)కనబడుచున్నది. కార్యకారణభావ నిశ్చయ మునందు ప్రతిబంధకములగు యీ రెండును(అన్వయ-వ్యతిరేక వ్యభిచారజ్ఞానములు)ఇక్కడ విద్యమానము లున్నందున అనగా ప్రతిబంధకజ్ఞానములున్నందున గ్రంథసమాప్తి మరియు మంగళములలో కార్యకారణభావ ము నిశ్చయము కాజాలకున్నది.

అట్లే, లింగము(హేతువు) లేనందువల్లగూడ నిర్విఘ్న-పరిసమాప్తికి మంగళము కారణమనుటలో అను మాన ప్రమాణమును లేదు. మంగళమునందు శిష్టాచారమను హేతువున్నదనిన, అది సరిగాదు. ఎందుకనగా శిష్టాచారమను పదమునకు ఏదోఒక నిర్వచనమున్నచో, దానిని హేతువుగా చెప్పవచ్చును. కాని,దానికి నిర్వ చనమే లేదు. కావున, శిష్టాచారముయొక్క ఆధారముతో(శిష్టాచారమును హేతువుగా చెప్పి) నిర్విఘ్న-పరిస మాప్తికి మంగళము కారణమని అనుమాన ప్రమాణమును చూపుట తగదు.

మంగళముయొక్క కారణత్వ ప్రతిపాదక ఆగమప్రమాణము(వైదిక-శబ్దము) ప్రత్యక్షముగా ఎచ్చటను

లభించుటలేదు. "నిర్విఘ్న-పరిసమాప్తికామో మంగళమాచరేత్" అను ఆగమవాక్యమును అనుమానింపవచ్చును గదాయని యనెదవేమో--అది కుదురదు. ఎందుకంటే, అనుమాన ప్రవృత్తియే సంభవించనప్పుడు ఆగమ వాక్యము అనుమేయమెట్లగును. అనగా ఆగమప్రమాణము అనుమేయమగుట అసంభవము.

అన్య ప్రకారముచేత గూడ గ్రంథసమాప్తి యగుచున్నందున, నిర్విఘ్న-పరిసమాప్తికి మంగళము కారణమనుటలో అన్యథానుపపత్తిరూప అర్థాపత్తి ప్రమాణముగూడ లేదు.

కావున, మంగళాచరణ విషయంలో యే ప్రమాణమును సిద్ధించుటలేదు గావున మంగళము ప్రమాణశూన్యము.

ఇట్లు పూర్వపక్షము ప్రాప్తించగా **సమాధానం** చెప్పబడుచున్నది. గ్రంథారంభమున మంగళాచరణము అవశ్యముగా చేయవలెను. మంగళాచరణ విషయంలో పూర్వపక్షి ఏ ప్రమాణాభావరూప దోషమును చూపెట్టాడో, అది యుక్తముకాదు. ఎందుకంటే, "నిర్విఘ్న-పరిసమాప్తికామో మంగళమాచరేత్"అను అనుమిత (అనుమేయ)శ్రుతియే మంగళాచరణ విషయంలో ప్రమాణము. అనుమానమే సంభవించదు--అను పూర్వపక్షోక్తి సరిగాదు. ఎందుకనగా, శిష్టాచారముయొక్క బలముచే ఆగమవాక్యమును అనుమానింపవచ్చును. తథాహి, "మంగళం వేదబోధితాభీష్టోపాయతాకమ్, అలౌకికావిగీతశిష్టాచారత్వాత్, దర్శాదివత్" మంగళము వేదముచే బోధింపబడిన ఇష్ట ఉపాయము గలది(ప్రతిజ్ఞా), అలౌకికము మరియు అవిగీత శిష్టులచే ఆచరింపబడుచున్నందువలన (హేతువు), "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" ఇత్యాదుల వలె(ఉదాహరణము).

అలౌకికత్వం నామ అన్వయ-వ్యతిరేకాప్రమాపి దర్శాదివత్। అలౌకికమనగా--వ్యావహారిక అన్వయ-వ్యతిరేకములచే ప్రమాపితము కానిది-దర్శాదులవలె. వ్యావహారిక అన్వయవ్యతిరేకములు:--- పౌష్టికాహారమును భుజించినచో శక్తి లభించును. భుజించనిచో శక్తి లభించదు. లేక వేదాధ్యయనముచే అర్థజ్ఞానము కలుగును. లేనిచో కలుగదు. ఇట్లు లౌకిక(వ్యావహారిక) కార్యకారణభావము అన్వయ-వ్యతిరేకములచే తెలియబడును. కాని, ఈ ప్రకారము లౌకిక అన్వయవ్యతిరేకములచే యే కార్యకారణభావము తెలియబడదో, మరేమనగా ఆగమప్రమాణముచేత మాత్రము తెలియబడునో, అదియే అలౌకికమనబడును. అలౌకికమనగా సంక్షేపముగా "వేదబోధితత్వమ్" అని.

"అవిగీతత్వం నామ బలవదనిష్టాననుబన్ధీష్టసాధనత్వమ్" తనకు ప్రబలమగు అనిష్టమును కలిగించనిదై ఇష్టమునకు మాత్రము సాధనము(ఉపాయము)గుటయే అవిగీతత్వమనబడును. "శిష్టత్వం నామ క్షీణదోషపురుషత్వమ్, వేదప్రామాణ్యాభ్యుపగన్తృత్వం, ఫలసాధనాంశే భ్రాన్తిరహితత్వమ్ వా" రాగద్వేషాది దోషములు లేనివారు శిష్టులు లేక "అస్య ఏతస్య మహతోభూతస్య నిశ్శ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదః"(బృ.2-4-10); "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ"(గీత.16-24); "శ్రుతస్మృతీ మమైవాజ్ఞే"(వరాహపురాణము & వే.పం.6-79); "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్"(రఘువం.2-2) ఇత్యాది ప్రమాణములననుసరించి ఈశ్వర ప్రణీత వేదములను, వేదానుసారి స్మృతులను పరమ ప్రమాణముగా స్వీకరించువారు శిష్టులనబడుదురు. లేక ఫలవిషయంలోగాని, సాధనవిషయంలోగాని భ్రాన్తి లేకుండుటయే శిష్టత్వమ్.

"ఆచారశ్చాత్ర కృతిః" ఆచార శబ్దమునకర్థము 'క్రియ'. అయినను ఇచ్చట 'ప్రయత్నరూప కృతి' అని గ్రహించబడినది. కావున, మంగళము శిష్టపురుషులయొక్క అవిగీత ఆచారమునకు విషయము--అని సిద్ధిస్తుంది. ఇట్టి శిష్టాచారముయొక్క బలముచే ఆగమవాక్యము అనుమానింపదగనుగాన "నిర్విఘ్న-పరిసమాప్తి

కామో మంగళమాచరేత్" అను అనుమిత శ్రుతియే మంగళాచరణమునందు ప్రమాణము.

పూర్వపక్షి ఏదైతే అన్వయ-వ్యతిరేక వ్యభిచారము చూపించెనో, అది పొసగదు. ఎందుకంటే, ఎక్కడ (నాస్తిక గ్రంథములలో) మంగళము చేయకుండానే సమాప్తి కనబడుచున్నదో, అక్కడ జన్మాంతరీయ (పూర్వ జన్మములో చేయబడిన)మంగళముయొక్క ప్రభావముచే విఘ్నములు ధ్వంసముకాగా గ్రంథసమాప్తి అయ్యింది--అని కల్పన చేయాలి. ఎక్కడ (ఆస్తిక గ్రంథములలో) మంగళము చేసినప్పటికిని సమాప్తి కనబడుటలేదో, అక్కడ విఘ్నములు బలవత్తరమైనవనిగాని,విఘ్నబాహుళ్యము(అనేక విఘ్నముల సముహము)గాని ఉంటాయని తెలియాలి. అవి అల్పమగు మంగళముచే నశింపవు. ఎందుకనగా,విఘ్నముల నాశము కొఱకు ప్రచుర (అధిక) మంగళములయొక్క ఆవశ్యకత ఉంటుంది. ఒక సామెతగూడా ఉంది---"యాదృశో యక్షస్తాదృశో బలిః"(యక్షానురూపో హి బలిః) యక్షుడు(దేవత) ఎట్లుండునో తదనురూపమైన బలి=అన్నము(నైవేద్యము)ను ఇవ్వాలి.

శంక:---ఏ పురుషునియొక్క కార్యమునందు విఘ్నములయొక్క అభావము స్వతస్సిద్ధమైయుండునో, అతనిద్వారా చేయబడు మంగళమునకు ఏవిధమైన ఫలనిష్పత్తి కాకుండుటచే, మంగళమును విఘ్నధ్వంససాధనముగా బోధించు శ్రుతి అప్రమాణమగును గదా?

సమా:---ఫలసాధనత్వబోధక శ్రుతిని అప్రమాణమనుట అసంగతము. ఎందుకంటే, ఒకానొక పుణ్యశాలి పురుషుడు నైసర్గికముగా(స్వాభావికముగా)నే పాపశూన్యుడై యున్ననూ, అతనిద్వారా ఎప్పుడైనా పాపము ఘటిల్లి ఉండవచ్చునేమోయను భ్రమచే ప్రాయశ్చిత్తము చేయబడును. ఆ ప్రాయశ్చిత్తమునకు పాపనివృత్తిరూప ఫలనిష్పత్తి లేకున్ననూ---ప్రాయశ్చిత్తవిధాయక శాస్త్రము అప్రమాణమని స్వీకరించబడదు. ప్రమాణముగానే స్వీకరించబడును.అట్లే,మంగళమును ఫలసాధనముగా బోధిచు శ్రుతికిగూడ అప్రామాణ్య ప్రసక్తి సంభవించదు.

3.ఈ మంగళము మూడు విధములు. 1.ఆశీర్వాదాత్మకము 2.నమస్కారాత్మకము 3.వస్తునిర్దేశాత్మకము.

1.పరమేశ్వరాత్ స్వస్య స్వశిష్యస్య వా వాఞ్ఛితార్థప్రార్థనమ్ ఆశీర్వాదః। తనకోసంగాని తనశిష్యులకోసంగాని అభీష్ట ప్రాప్త్యర్థము(జ్ఞానమునుగాని జ్ఞానసాధ్య మోక్షమునుగాని కోరి) పరమేశ్వరుణ్ణి ప్రార్థించుట ఆశీర్వాదాత్మక మంగళమనబడును. ఉదా:---

శ్లో॥స్తమ్భాభ్యన్తరగర్భభావనిగదవ్యాఖ్యాతతద్వైభవో,
యః పాఞ్చాననపాఞ్చజన్యవపుషా వ్యాదిష్టవిశ్వాత్మతః
ప్రహ్లాదాభిహితార్థతత్క్షణమిలదృష్టప్రమాణం హరిః,
సోఽవ్యాద్వః శరదిన్దుసున్దరతనుః సింహాద్రిచూడామణిః॥(తత్త్వప్రదీపికయను చిత్సుఖీ 1-1)

ఎవరు స్తంభమధ్యమున నివసించి, నృసింహ శరీరమును ధరించి తన వ్యాపకత్వమును, విశ్వరూపమును సువ్యక్తము చేసెనో, ప్రహ్లాదవచనమును సార్థకముచేయుటలో ప్రత్యక్ష ప్రమాణభూతమును, శరచ్చంద్రునివంటి నిర్మలాకారము గలవాడును, సింహగిరి భూషణుడును అగు ఆ భగవంతుడగు శ్రీహరి మీ అందఱిని రక్షించుగాక!

శ్లో॥యస్త్యక్త్వా రూపమాద్యం ప్రభవతి జగతోఽనేకధానుగ్రహాయ,
ప్రక్షీణక్లేశరాశిర్విషమవిషధరోఽనేకవక్త్రః సుభోగీ।
సర్వజ్ఞానప్రసూతిర్భుజగపరికరః ప్రీతయే యస్య నిత్యం,

దేవోఽహీశః స వోఽవ్యాత్సితవిమలతనుర్యోగదో యోగయుక్తః॥(యో.సూ.వ్యాసభాష్యము)

ఎవరు తన మూలస్వరూపమును వదలి, లోకులను అనేక విధములుగా అనుగ్రహించుట కొఱకు అవతీర్ణుడయ్యెనో, ఎవరియొక్క అవిద్యాది సమస్త క్లేశములు ప్రకృష్టరూపముచే వినష్టమయ్యెనో, ఎవరు పరమ దుస్సహమగు విషమును ధరించువాడో, ఎవరికి అనేక ముఖములు గలవో, ఎవరు దివ్య భుజగ శరీరమును గలిగి సకలజ్ఞానములకు ఉత్పత్తిస్థానమో, ఎవరి ప్రీతిని సంపాదించుట కొఱకు అనేక భుజంగములు(సర్పములు)తత్పరములై యుండునో, తెల్లని స్వచ్ఛమైన శరీరము ఎవరికి గలదో, అటువంటి యోగశాస్త్రమును ప్రవర్తింపజేసిన యోగప్రదాత యోగయుక్తుడగు శ్రీఅనంత భగవాన్(శ్రీపతఞ్జలి) యోగశాస్త్రమును అధ్యయనముచేయు మీ అందఱిని రక్షించుగాక!(నిస్సందేహముగను, భ్రమరహితముగను తన భావము సుకరముగా అవగతమగునట్లు అనుగ్రహించు గాక!)

2.స్వాపకర్షబోధానుకూలః స్వీయవ్యాపారవిశేషో నమస్కారః। ప్రణమిల్లుటకు యోగ్యమైన గురువు లేక పరమేశ్వరుని కొఱకు తనయొక్క నికృష్టతను(న్యూనతను) ప్రకటిస్తూ(వ్యక్తీకరిస్తూ) ప్రణామముచేయు పురుషుని మనోవాక్కాయములతో చేయు వ్యాపార విశేషమునకు నమస్కారమందురు. ఉదా:---

శ్లో॥అవికల్పవిషయ ఏకః, స్థాణుః పురుషః శ్రుతోస్తి యః శ్రుతిషు।

ఈశ్వరముమయా న పరం, వన్దేఽనుమయాపి తమధిగతమ్॥(ఖండన ఖండ ఖాద్యము 1-1)

శ్రుతులలో అనేక నామరూపములచే ఏకము(అద్వితీయము), స్థాణుః=కూటస్థనిత్యము, నిర్వికల్ప సమాధికి విషయము--అని తెలియబడుచున్న, కేవలము ఉమ(విద్య)చేతనే కాకుండా, అనుమచేతగూడ (శ్రవణ మననాదుల పిదప అనుమానముచేతగూడ) నాచే సాక్షాత్కరింపబడిన పరిపూర్ణ పరిచ్ఛేదశూన్య ఆ పరమేశ్వరునికి అభివాదములు.

శ్లో॥నమః శ్రీ శంకరానన్దగురుపాదామ్బుజన్మనే।

సవిలాస మహామోహగ్రాహగ్రాసైక కర్మణే॥(వేదన్తపఞ్చదశి 1-1)

విలాస(కార్య)సహిత మూలాజ్ఞానరూప గ్రాహమును(మొసలిని) గ్రసించుటయే(ధ్వంసము చేయుటయే) ముఖ్య కార్యముగా గలిగిన, సర్వలోకములకు ఆనందమును ప్రసాదించు ప్రత్యగభిన్న పరబ్రహ్మస్వరూపుడగు, శ్రీ శంకరానంద సద్గురుదేవులయొక్క పాదపద్మయుగళమునకు నమస్కారములు.

3."గ్రంథప్రతిపాద్యవస్తునః నిర్దేశనం వస్తునిర్దేశః। గ్రంథమునందు ప్రతిపాదిత విషయరూప వస్తువుయొక్క నిర్దేశమాత్రము చేయుటయే వస్తునిర్దేశమనబడును. అదియును సగుణవస్తునిర్దేశము మరియు నిర్గుణవస్తునిర్దేశము అని రెండు విధములు. ఉదా:---

శ్లో॥అదృష్టద్వయమానన్దమాత్మానం జ్యోతిరవ్యయమ్।

వినిశ్చిత్యశ్రుతేః సాక్షాద్యుక్తిస్తత్రాభిధీయతే॥(వేదాన్త సిద్ధాన్త ముక్తావళిః)

వికారరహితము, ఆనందఘనము, ప్రకాశస్వరూపము, సజాతీయ విజాతీయ స్వగతాదిభేదరహితము మరియు మిథ్యాప్రపంచముయొక్క లేశశూన్యమునగు ఆత్మను శ్రుతిచే సాక్షాత్కరించుకొన్న మీదట, తద్విషయక శ్రుత్యనుకూల తర్కము చెప్పబడుచున్నది. హిందుస్థాని దోహా:--

జో సుఖ నిత్య ప్రకాశ విభు నామరూప ఆధార్। మతి న లఖై జిహి మతి లఖై సో మై శుద్ధ అపార॥

(శ్రీ విచారసాగరమునుండి)

ఏది సుఖరూపమై, నిత్యమై, స్వయంప్రకాశస్వరూపమై, వ్యాపకమై, నామరూపప్రపంచముకు ఆధారమై, దేశ కాల వస్తుపరిచ్ఛేదశూన్యమై, మాయ(అజ్ఞాన)రూప మలరహితమై--శ్రుతి ప్రసిద్ధ ఏ బ్రహ్మము గలదో, దానిని శక్తివృత్తిచేత బుద్ధి తెలియజాలదు, కాని లక్షణావృత్తిచే తెలిసికొనగలదు, మలిన మతికి తెలియబడదు, శుద్ధమతికి తెలియబడును, శుద్ధమతిగూడ ఫలవ్యాప్తిచే కాకుండా వృత్తివ్యాప్తిచే తెలిసికొన గలుగును-- అటువంటి ఆ బ్రహ్మమే నేనై యున్నాను.

శ్రీమహాదేవానన్ద సరస్వతీ స్వాములవారు గూడ వారి "తత్త్వానుసంధానము" అను గ్రంథారంభమున తత్త్వానుస్మరణాత్మక వస్తునిర్దేశరూప మంగళము చేసి యున్నారు---"దేహో నాహం..........మాయాసాక్షీ కృష్ణ ఏవాహమస్మి" అని.

ఇట్లు మంగళాచరణము యొక్క ప్రకారములు చెప్పబడినవి. ఇంకా వీటియొక్క అవాంతర భేద ములు ఇరువది ఏడు విధములుంటాయని, అవి "శ్రీ బోధరత్నాకరము" అను గ్రంథమున వ్రాసియున్నామని శ్రీ పండిత పీతాంబరజీవారు శ్రీ వేదాన్తబాలబోధము ప్రారంభమున టిప్పణములో చెప్పియున్నారు.

౪.ఏదైనా కార్యముయొక్క లేదా గ్రంథముయొక్క ప్రారంభంలో అవశ్యముగా నిర్గుణబ్రహ్మముయొక్క గాని, సగుణబ్రహ్మముయొక్కగాని స్మరణాత్మకమగు మంగళమును చేయుట--అనునది సకల ఆస్తికులలో అనాది సంప్రదాయానుసారంగా పరంపరగా వస్తూంది. పూర్వీకులగు ఋషి-మునులు మున్నగు శిష్టులు-[1]ఆర్యులు వ్యాస,వాల్మీక్యాదులు మొదలుకొని అస్మదాచార్యుల పర్యన్తము మంగళమును ఆచరిస్తూ వస్తు న్నారు. ఈ శిష్టాచారముచేతనే "నిర్విఘ్నపరిసమాప్తికామో మంగళమాచరేత్" అను ఆగమప్రమాణమును అనుమానింపవచ్చును--అనిగూడ పూర్వము తెలుసుకుంటూ వచ్చాము.కేవలము అనుమానముచేతనే కాకుం డా ప్రత్యక్షముగా కూడ [2]శ్రుతి స్మృతి సూత్ర గ్రంథాలలో పద్యరూపంలోనో, గద్యరూపంలోనో లేదా 'ॐ' 'అథ' అను శబ్దరూపంలోనో మనము తరచుగా మంగళాచరణమును చూస్తూనే ఉన్నాము.

శ్లో॥ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా। కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ॥
(నారదీయ మహాపురాణము-పూర్వభాగము.51-10)

'ॐ' (ఓంకారము) మరియు 'అథ' అను ఈ రెండు శబ్దములు సృష్ట్యారంభమున బ్రహ్మదేవుని కంఠము నుండి స్వయంగా వెలువడినవి. కావున, ఇవి మంగళకర శబ్దములుగా వ్యవహరింపబడుచున్నవి.

"ఓమితి బ్రహ్మ। ఓమితీదగ్ం సర్వమ్।"(తై.1-8); "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ"(మహానా.11-5; బ్రహ్మవిద్యో.2; గీత.8-13); "ఓమిత్యేతదక్షరమిదగ్ం సర్వం.......సర్వమోంకార ఏవ"(మాం.1); "ॐ తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రి విధః స్మృతః"(గీత.17-23); "తస్య వాచకః ప్రణవః"(యో.సూ.1-27) ఇత్యాది శ్రుతి స్మృతులన్నియు 'ఓం' అను అక్షరము పరబ్రహ్మస్వరూపమని, బ్రహ్మముయొక్క నామధేయమని ఏకకంఠముగా ఉద్ఘోషించుచున్నవి. అందువలన, పరమాత్మను స్మరించుటయే మంగళమగును. దానిచే సకల విఘ్నములు(పాపములు) ధ్వంసమ

---

[1] ఆర్యులనగా,
శ్లో॥కర్తవ్యమాచరన్కామమకర్తవ్యమనాచరన్। తిష్ఠతి ప్రాకృతాచారో యః స ఆర్య ఇతి స్మృతః॥
శ్లో॥యథాచారం యథాశాస్త్రం యథాచిత్తం యథాస్థితమ్। వ్యవహారముపాదత్తే యః స ఆర్య ఇతి స్మృతః॥
కామ్య నిషిద్ధములను వర్జించి స్వవర్ణాశ్రమ సర్వ నిత్యనైమిత్తిక కర్మలను విధిపూర్వకముగా చేస్తూ, ప్రాకృతాచారః= సహజమైన ఆచరణ గలవారు, వృద్ధపురుషులయొక్క ఆచారములననుసరించి, అదియును శాస్త్రోక్త ప్రకారముగా మరియు కాలాంతరమున పరితాపమునకు హేతువుకాని విధముగా చిత్తమునకు ప్రసన్నతను చేకూరునట్లుగా లౌకిక వైదిక(శాస్త్రీయ)వ్యవహారములనాచరించువారు 'ఆర్యుల'నబడుదురు.(యో.వా.నిర్వాణప్ర.పూర్వార్ధము 126-54&55)

[2] శ్లో॥శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః।(మనుస్మృతి 2-10)

గును.

శ్లో॥తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః। ప్రవర్తన్తే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్॥(గీత.17-24)

పరబ్రహ్మముయొక్క నామముగా నిర్దేశింపబడినదగుటచేతను, ప్రశస్తమైనదగుట వలనను, పావనముచే యునదగుట వలనను, వేదాధ్యయనసంపన్నులు, శాస్త్రచోదితములైన యజ్ఞదానతపస్స్వరూపములైన కర్మల ను చేయుటకు ముందుగా 'ఓ'కారమునుచ్చరించి చేయుదురు. ఇట్లు ప్రణవమునుచ్చరించి చేయుటవలన ఆ క్రియలకుగల సమస్త విఘ్నములు విధ్వస్తమగును. మరియు ఆ క్రియలలోగల మంత్ర-స్వరవర్ణోచ్చారణవల్ల గలుగు దోషములు నశించి, ఆ కర్మలు సంపూర్ణ ఫలమునిచ్చును.

శ్లో॥బ్రాహ్మణః ప్రణవం కుర్యాదాదావన్తే చ సర్వదా। స్రవత్యనోఙ్కృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతి॥

వేదాధ్యయనముయొక్క ఆరంభమున మరియు సమాప్తియందు ఎల్లప్పుడును అవశ్యముగా 'ఓ'కార మునుచ్చరించ వలెను. ఒకవేళ ఆదియందు ప్రణవమునుచ్చరించనిచో విద్యయందు శ్రద్ధ, ఈశ్వరానుగ్రహము గలుగనేరదు.మరియు అంత్యమున ఉచ్చరించనిచో నేర్చిన విద్య విస్మృతి గలుగును.నిష్ఫలమగును. (మను. 2-74)

శ్లో॥మంగళాచారయుక్తానాం నిత్యం చ ప్రయతాత్మనామ్। జపతాం జుహ్వతాం చైవ వినిపాతో న విద్యతే॥

ప్రతినిత్యము (బ్రహ్మవిద్యారంభమున) ప్రీతిపూర్వకముగా ప్రయత్నముతో మంగళము చేయువానికి, జప, హోమాదులు చేయు జితేన్ద్రియునికి ఎప్పుడునూ పతనముండదు. ఇహపరసౌఖ్యమునొందును.(మను.4-146)

శ్లో॥పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్।(వి.సహస్ర.10)

పవిత్రము జేయగల తీర్థాదులలోకెల్ల పవిత్రము పరమాత్మ. అతని ధ్యాన, దర్శన, కీర్తన, స్తుతి, పూజ, స్మరణ, ప్రణామాదులచే, సమస్త పాపములు సమూలంగా పెరికివేయబడును. లేక పరమాత్మయొక్క యథార్థ జ్ఞానముచే సంసార బన్ధమునకు కారణమైన పుణ్యపాపరూప కర్మలు మరియు వాటికి హేతువగు అజ్ఞానము ను అశేషముగా నష్టమగును.అందుకే పవిత్రములకంటె పవిత్రము పరమాత్మ. మంగళమనగా సుఖము. దాని కి ఏవి సాధనములుగా, జ్ఞాపకములుగా ఉన్నవో,వాటికిగూడ పరమానందరూప పరమమంగళమై యున్నందు న ఆ పరమాత్మ మంగళములకుగూడ మంగళము.

శ్లో॥సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషామమంగళమ్। యేషాం హృదిస్థో భగవాన్మంగళాయతనో హరిః॥

ఎవరియొక్క హృదయంలో సమస్త మంగళములకు నిలయమైన భగవంతుడగు శ్రీహరి విరాజిల్లుచుండు నో, వారికి ఎప్పుడును, ఏ కార్యమందైననూ ఏవిధమైన అమంగళములు సంభవించవు.(స్కం.పు.5-3-157-7)

శ్లో॥హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః। అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః॥

ఇచ్ఛలేకున్నను అగ్నిని ముట్టినచో ఎట్లు కాల్చివేయునో, అట్లే ఇచ్ఛలేకున్నను దుష్టచిత్తులగు(దురాత్ముల గు) పురుషులచేతగూడ ఒకవేళ శ్రీహరియొక్క స్మరణ జరిగినచో, అతడు వారియొక్క సమస్త పాపములను హరించివేయును.(బృ.నారదీయము.1-11-100)

శ్లో॥భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వ సంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥

ఆ పరావరుడగు పరమాత్మయొక్క దర్శన మాత్రముచే జీవునియొక్క (అవిద్యారూప) హృదయగ్రంథి భిన్నమగును. అతనియొక్క సకల సంశయములు నష్టమగును. మరియు సమస్త కర్మలు (ప్రారబ్ధం హిత్వా) క్షీణించును.(ముం.2-2-8)

వ్యాకరణ-మహాభాష్యకారులగు శ్రీపతఞ్జలి భగవాన్ కూడ ఇట్లు సెలవిచ్చియున్నారు. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథన్తే, వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణ్యధ్యేతారశ్చ బుద్ధియుక్తా(సిద్ధార్థా) యథా స్యురితి" గ్రంథముయొక్క ఆదిమధ్యావసానములందు అవశ్యముగా మంగళము చేయాలి. మంగళాచరణము చేయుటవలన రచింపబడిన శాస్త్రము(గ్రంథము)యొక్క అవిచ్ఛిన్న శిష్యప్రశిష్యపరంపరగా విస్తృత ప్రచారమగును.గ్రంథాధ్యయనము-అధ్యాపనముచేయు పురుషులు పరులచే అపరాజయరూప సామర్థ్యమును, ఇష్టదేవతానుగ్రహముచే అంతఃకరణశుద్ధిని, (పుణ్యము వృద్ధియగుట వలన)పుణ్యోపచయముచే దీర్ఘాయువును పొంది, (సిద్ధిః=అధ్యయన సమాప్తిః) అధ్యయనము నిర్విఘ్నముగా పరిసమాప్తమయ్యి పరిపూర్ణులగుదురు.

కావున, శిష్టాచారానుమిత, స్మృత్యనుమిత శ్రుతిప్రమాణక మంగళాచరణమును గ్రంథారంభమున అవశ్యముగా చేయాలి.

౫.ఇక మంగళాచరణముయొక్క ఫలవిషయంలో పూర్వపక్షము:---

మంగళాచరణమునకు ప్రయోజనమేమియు కనుపించుట లేదు. గ్రంథసమాప్తియే ఫలమనిన--అది అనుచితము. ఎందుకనగా, మంగళాచరణము చేయకుండానే ప్రయోజనరూప ఫలము నాస్తిక గ్రంథములలో కనబడుచున్నది. అందువలన గ్రంథసమాప్తి మంగళాచరణముయొక్క ప్రయోజనము కాదు. ఒకవేళ విఘ్నధ్వంసమే ప్రయోజనమనిన--ఎక్కడ విఘ్నవిరహము(విఘ్నములయొక్క అభావముగాని, నాశముగాని) స్వతస్సిద్ధమై(స్వాభావికమై)యుండునో, అక్కడ విఘ్నములయొక్క సంభావనయే లేనందున, మంగళాచరణముయొక్క ప్రయోజనము విఘ్నధ్వంసమని చెప్పుట ఉచితము కాదు.

ఉత్తరపక్షము:---సిద్ధాన్తి సమాధానము చెప్తున్నాడు. ధర్మశాస్త్రమునకు అవిరుద్ధమున్నందున మంగళాచరణమును శిష్టపురుషులు [3]ఆచరిస్తూ వస్తున్నారు. అందుకని మంగళాచరణమునకు ఏదో ఒక ఫలము తప్పకుండా ఉంటుందని [4]నిశ్చయింపబడుతుంది. ధర్మవిషయంలో శిష్టులయొక్క ఆచరణయే ప్రమాణముగా స్వీకరించబడుతుంది. కావున, శిష్టాచారానుమిత "నిర్విఘ్నపరిసమాప్తికామో [5]మంగళమాచరేత్" అను శ్రుతిబలముచేత విఘ్నధ్వంసముద్వారా 'గ్రంథసమాప్తియే' మంగళముయొక్క ప్రయోజనరూప ఫలమని సిద్ధించుచున్నది. ప్రస్తుతము గ్రంథసమాప్తి వ్యతిరిక్త ఫలసంభావనయే లేదు. ఎందుకంటే, "దృష్టఫలకత్వేఽదృష్టఫలకల్పనాయా అన్యాయ్యత్వాత్" ఫలములు రెండు విధములు. ఒకటి దృష్టఫలము, రెండవది అదృష్టఫలము. సమాప్తిరూపదృష్టఫలము సంభవించుచుండగా స్వర్గాది అదృష్టఫలకల్పన అనుచితము."ప్రారబ్ధం మే కర్మనిర్విఘ్నం పరిసమాప్యతామ్" నా ప్రారబ్ధము ఈ కార్యమును నిర్విఘ్నముగా పరిసమాప్తము చేయుగాక--అను ఇచ్ఛ పురుషునిలో ఉన్నందున, మంగళాచరణమునకు (పశుపుత్రధనాదులకంటె అతిరిక్త)దృష్టఫలమగు 'సమాప్తి'రూ

[3] శ్లో॥శ్రుతిప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మే నివిశేత వై।
శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్హి మానవః। ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్॥
యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్విజః। స సాధుభిర్బహిష్కార్యో **"నాస్తికో వేదనిన్దకః"**॥
వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః। ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్॥
(మనుస్మృతిః 2వ అధ్యా. శ్లో 8,9,11,12)

[4] శ్లో॥ప్రయోజనమనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే। ప్రయోజనం సంప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్॥
(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము 12)

[5] ఈ శ్రుతిప్రమాణము ప్రస్తుత(ఏ వేదశాఖలోగూడ) శ్రుతులలో, స్మృతులలో ఎక్కడను కనుపించుట లేదు. అనేక వేదశాఖలు కాలాంతరములో రానురాను ఉచ్ఛిన్నమై(లుప్తమై) పోయాయి. అయినను శిష్టాచారము వలన మంగళముయొక్క కర్తవ్యము తెలియబడుతుంది.

ప ప్రసిద్ధ ఫలమే ఉపస్థితమై యున్నది.

వ్యతిరేక అనుమాన ప్రయోగము:---"మంగళం సమాప్తిఫలకమ్, సమాప్త్యన్యాఫలకత్వే సతి సఫలత్వాత్, యన్నైవం తన్నైవం యథా దర్శాదిః" మంగళము సమాప్తిరూప ఫలజనకమున్నది. సమాప్తిరూప ఫలమున కంటె అన్యఫలమునకు అజనకమై యున్నది. అయినను మంగళము ఫలజనకముగా స్వీకరించబడుతుంది. అందువలన ఏ వస్తువు సమాప్తిరూప ఫలమును పుట్టించక, అన్యఫలమును పుట్టించునో, అది సఫలముగా అంగీకరించబడును. ఎట్లనగా, దర్శపూర్ణమాస కర్మ సమాప్తిరూప ఫలముకంటె భిన్నమగు స్వర్గాది ఫలముగ లదగుచున్నందున అది సఫలము అని చెప్పబడును. ఈ కారణముచే దర్శాది కర్మలకు 'సమాప్తిరూప' ఫలము లేదు. కాని మంగళము అలాకాకుండా సమాప్తిరూప ఫలమునకంటె భిన్న ఫలమును పుట్టించనిదై, సమాప్తిరూప ఫలమునకు కారణమగుచున్నందున సఫలమున్నది. కావున, మంగళాచరణమునకు 'సమాప్తి' యే ఫలమని నిశ్చయించబడినది.

ఎచ్చట మంగళాచరణము లేకయే సమాప్తి కనబడుచున్నదో, అచ్చట జన్మాంతరీయ కృతమంగళమును కల్పన చేయాలి. ఎచ్చట స్వతస్సిద్ధ విఘ్నాభావముండునో, అచ్చట విఘ్నసంశయముచే మంగళాచరణమునందు ప్రవృత్తి కలుగుట ఉచితమే--యను విషయము పూర్వము చర్చించబడినది.

ప్రాచీన నైయాయికులు(గౌతమీయులు) మంగళమునకు 'గ్రంథసమాప్తి'యే ఫలమని నుడువుదురు. కాని, శీఘ్రవినాశశాలి మంగళము కాలాంతరభావి సమాప్తికి కారణమెట్లగును? "కార్యనియత అవ్యవహిత పూర్వ వృత్తిత్వం కారణత్వమ్" కార్యమునకు నియమముచేత పూర్వక్షణములో సమీపవర్తియై యుండునది కారణ మనబడును. ఏదో ఒక అవాంతర వ్యాపారము లేకుండా మంగళమునకు సాక్షాత్ సమాప్తి కారణత్వము సంభవించదు. అందువలన, మంగళమునకు మరియు సమాప్తికి మధ్యలో (తజ్జన్యత్వే సతి తజ్జన్యజనకో వ్యాపారః) మంగళమునుండి పుట్టి, మంగళజన్య సమాప్తిరూప కార్యమును పుట్టించునదై, సమాప్తిరూప కార్యమునకు నియమముచేత పూర్వక్షణములో పురోవర్తియై యుండునదియగు ఏదో ఒక వ్యాపారమును కల్పన చేయాలి. ఆ వ్యాపారము--గ్రంథసమాప్తికి ప్రతిబన్ధకములగు దురితరూప విఘ్నములయొక్క ధ్వంసమే యగును. ఆ విఘ్నధ్వంసము మంగళమునుండి పుట్టి మంగళముయొక్క కార్యమగు గ్రంథసమాప్తికి కారణ మగుచున్నది. కావున విఘ్నధ్వంసము వ్యాపారమగును. ఎట్లు యజ్ఞరూప క్రియ కాలాంతరభావి స్వర్గమున కు స్వజన్య అపూర్వము ద్వారా కారణమగుచున్నదో, అట్లే మంగళముగూడ విఘ్నధ్వంసరూప వ్యాపారము ద్వారా గ్రంథసమాప్తికి కారణమగుచున్నది.

చింతామణికారులు గంగేశోపాధ్యాయులు మొదలుకొని నవీన నైయాయికులు మంగళమునకు ఫలము గ్రంథసమాప్తి కాదనియు నుడువుదురు. కాని, సమాప్తికి ప్రతిబన్ధకములగు దురిత=పాపరూప విఘ్నములయొక్క ధ్వంసము మాత్రమే మంగళముయొక్క ఫలమున్నది. మరియు గ్రంథసమాప్తి యేదిగలదో, అది ఆ విఘ్నాభావఘటిత అదృష్టము, బుద్ధిస్ఫూర్తి మొదలగు కారణసామగ్రులచేత కలుగును. సమాప్తికి కారణరూప విఘ్నధ్వంసమునకు కారణమగుటవలన మంగళము సమాప్తికైననో అన్యథాసిద్ధమగును. "కారణసామగ్రీ బాహ్యత్వం అన్యథాసిద్ధత్వమ్" ఏ కార్యమునకు ఎంత కారణసామగ్రీ అవసరమో, ఆ కారణసామగ్రీకంటె యే వస్తువుభిన్నముగానుండునో, ఆ వస్తువు ఆ కార్యమునకు అన్యథాసిద్ధమగును.

ప్రాచీనాచార్యుల మతరీత్యా మంగళము విఘ్నధ్వంసముద్వారా సమాప్తికి కారణమని చెప్పినచో,

విఘ్నధ్వంసము మరియు గ్రంథసమాప్తి--అను రెండు కార్యములు స్వీకృతమగును. అది గౌరవదోషమగును. కావున, విఘ్నధ్వంసమే మంగళముయొక్క కార్యమని సమ్మతించినచో లాఘవరూప గుణమగును. ఇదియే ఉచితముగా తోచుచున్నది.

యద్యపి గ్రంథకర్త తన మనస్సులో చేసిన మంగళాచరణము గ్రంథసమాప్తియందు నిర్విఘ్నమునకు హేతువగుచున్నది. తథాపి గ్రంథకర్తయందు నాస్తిక్యభావమును దూరం చేసి జిజ్ఞాసుజనులను గ్రంథాధ్యయన మునందు నిస్సంశయముగా ప్రవృత్తము చేయుటకొఱకు మరియు గ్రంథముయొక్క ఆదిమధ్యావసానములం దు శిష్టాచారముచే ప్రాప్త మంగళమును తప్పకుండా ఆచరించాలి--అని ఆగామి శిష్యపరంపరకు బోధించుట కొఱకు, మంగళమును గ్రంథారంభమున లిఖితపూర్వకంగా వ్రాయుట యోగ్యము.

ప్రయోజనరూప ఫలము ద్వివిధము. ఒకటి పరమ(ముఖ్య)ప్రయోజనము, రెండవది అవాంతర(గౌణ) ప్రయోజనము. ఏ ఫలప్రాప్తి కొఱకు పురుషునికి ఇచ్ఛ కలుగునో, అది పరమ ప్రయోజనము. ఉదా:--ఆమ్ర (మామిడి)వృక్షమును నాటుటకు ముఖ్యప్రయోజనము ఆమ్రఫలము. ఆ పరమ ప్రయోజనమునకు యేది సా ధనమో, అది అవాంతర ప్రయోజనమగును. ఉదా:--ఆమ్రవృక్షమునకు అవాంతర ప్రయోజనములు వృక్ష ఛాయ, కలప(చెఱకు) ఇత్యాదులు.

అట్లే, మంగళమునకు ముఖ్య ప్రయోజనము విఘ్నధ్వంసముద్వారా గ్రంథసమాప్తి యగును. అథవా మతభేదముచే గ్రంథసమాప్తి లేదా విఘ్నధ్వంసమగును. మరియు అవాంతర ప్రయోజనములు అనేకము గలవు.

1.గ్రంథకర్తపట్ల (ఆస్తికుడా? నాస్తికుడా?) అను సందేహమును దూరంచేసి ఆస్తికుడేయను విశ్వాసమును కుదుర్చుట. 2.శిష్టాచార సంప్రదాయ రక్షణము. 3.ఈశ్వరానుగ్రహముచే ప్రతిభా ప్రాప్తి(అంతఃకరణశుద్ధి). 4.అప్రతిపత్తి(అజ్ఞానము), అన్యథాప్రతిపత్తి(విపరీతభావన), విప్రతిపత్తి(విరుద్ధ నానాకోటిక జ్ఞానము=సంశయ ము)---వీటన్నిటియొక్క నివృత్తి మొదలుకొని యథాయోగ్యమూహనీయములు.

॥ఇతి మఙ్గళవాదః॥

————————@@@————————

---

## అనుబంధ చతుష్టయము

ఏదేని గ్రంథమును ఆరంభించుటకు ముందు అనుబంధ చతుష్టయమును నిరూపించుట గ్రంథకర్తయొ క్క అవశ్యకర్తవ్యముగా ఆర్షసంప్రదాయము చాటుచున్నది. కావున, గ్రంథారంభమునందు మంగళాచరణము లోనే అనుబంధ చతుష్టయమును నిహితమొనర్చి మంగళముచేయుట సంప్రదాయ పరిపాటి. లేనిచో, మంగళము నిరర్థకమగును. ప్రశస్తము కానేరదు, రాణించదు.

శ్లో॥సంబన్ధశ్చాధికారీ చ విషయశ్చ ప్రయోజనమ్। వినానుబన్ధం గ్రంథాదౌ మఙ్గళం నైవ శస్యతే॥
శ్లో॥సర్వస్యైవ హి శాస్త్రస్య కర్మణో వాపి కస్యచిత్। యావత్ప్రయోజనం నోక్తం తావత్తత్కేన గృహ్యతే॥
శ్లో॥సిద్ధార్థం జ్ఞాతసంబంధం శ్రోతుం శ్రోతా ప్రవర్తతే। శాస్త్రాదౌ తేన వక్తవ్యః సంబంధః సప్రయోజనమ్॥
(శ్లోకవార్తికము ప్రతిజ్ఞాసూత్రము శ్లో.12&17)

కర్మశాస్త్రముగాని మరియే యితరశాస్త్రముగాని దాని ప్రయోజనము చెప్పనంతవరకు దానియందు

ప్రేక్షావత్పురుషుడు(వివేకి) నిస్సంశయముగా ప్రవృత్తుడు కాజాలడు. శ్రోతాపురుషునికి యే శాస్త్రముయొక్క ప్రయోజనము మరియు సంబంధము జ్ఞాతమైయుండునో, ఆ శాస్త్రమునే శ్రవణము చేయుటకు ప్రవృత్తుడగును. అందువలన శాస్త్రకర్తయగు విద్వత్పురుషుడు శాస్త్రారంభమున శ్రోతృపురుష ప్రవృత్త్యర్థము శాస్త్రప్రయోజనము మరియు సంబంధమును అవశ్యముగా తెలుపదగియున్నది.

శ్లో॥ప్రయోజనం సంప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్।

ప్రయోజనమనుద్దిశ్య నమన్దోఽపి ప్రవర్తతే॥(స.వే.సి.సా.సం. 12)

ఫలము(ప్రయోజనము)కార్యమునందు సమ్యక్ప్రవృత్తికి హేతువౌతుంది. ఫలమునపేక్షించకుండా ఎంత మందబుద్ధిగలవాడుగూడ యేకార్యమునందు ప్రవృత్తుడుకాడు.

అట్లే, శ్రీయాస్కమునీంద్రులవారుగూడ వారి నిరుక్తము(3-1-7)లో "మనుష్య"శబ్దమును నిర్వచిస్తూ "మత్వా కర్మాణి సీవ్యతీతి మనుష్యః" అనిచెప్పారు. మనుష్యుని స్వభావమేమిటంటే- యేకార్యమును(పనిని) గూడ ముందుగా విచారించకుండా (ఆలోచించకుండా) చేయుటకు తలపెట్టడు. ఇది లోకంలో అనుభవము గూడ ఉంది. మనుష్యుడు ఎప్పుడైతే, ఈ (అముక)కార్యము చేయుటవలన నాకు ఇష్టసాధనమౌతుంది (నాఅభీష్టసిద్ధికి సాధనమౌతుంది) "ఇదం మదిష్టసాధనమ్" అని, మరియు ఈ(అముక) కార్యమును(పనిని) చేయుటకు నేను సమర్థుడను (నేనుచేయగలను) "ఇదంమత్కృసాధ్యమ్" అను నిశ్చయానికొస్తాడో, అప్పుడే ఆ కార్యమునందు ఉత్సాహముతో ప్రవృత్తుడౌతాడు (చేయుటకు పూనుకుంటాడు ).లేనిచో ఆ కార్యమును చేయుటకు ముందుకు రాడు. పైరెండు ప్రకారముల-అనగా, "ఇదం మదిష్టసాధనమ్" మరియు "ఇదం మత్కృతిసాధ్యమ్" అను జ్ఞానముచేత అనుబంధచతుష్టయము అనాయాసముగా బోధపడుతుంది. ఎట్లనగా, "ఇదమ్" శబ్దముచేత "విషయము"; "మత్" శబ్దముచేత "అధికారి"; "ఇష్ట" శబ్దముచేత "ప్రయోజనము"(ఫలము) మరియు "సాధన-సాధ్య" శబ్దములచేత "సంబంధము"యొక్కజ్ఞానము కల్గుతుంది. 1.అధికారి, 2. విషయము, 2.ప్రయోజనము, 4.సంబంధము అను ఈ నాలుగు "అనుబంధచతుష్టయము" అనబడుతాయి.

"గ్రంథ ప్రవృత్తి ప్రయోజక జ్ఞానవిషయత్వమ్-అనుబంధత్వమ్".గ్రంథమునందు ప్రవృత్తిచేయగల (ఇదం మదిష్టసాధనమ్, ఇదం మత్కృతిసాధ్యమ్)అను జ్ఞానమునకు విషయీభూతములగు ఉపరోక్త విషయాదులు నాలుగు అనుబంధములగును. ఈ అనుబంధచతుష్టయజ్ఞానము కలిగినపిదపయే ప్రేక్షావత్పురుషుడు (వివేకి) గ్రంథమునందు నిస్సందేహంగా ఉత్సాహముతో శ్రవణాదులు చేయుటకు ప్రవృత్తుడగును.

## అధికారి వర్ణనము

1.అధికారి :- "మలవిక్షేపరహితత్వేసతి సాధనచతుష్టయసంపన్నత్వేసతి స్వస్వరూపాఽజ్ఞానవాన్ – అధికారీ" ఎవరి యందు మలదోషము గాని, విక్షేప దోషము గాని లేవో, స్వస్వరూప అజ్ఞానము మాత్రము గలదో మరియు సాధనచతుష్టయసంపత్తి (వివేకము, వైరాగ్యము, షట్ సంపత్తి మరియు ముముక్షుత్వము) గల్గియుండునో, అతడు వేదాన్తశాస్త్ర విచారమునకు "అధికారి" యగును.

ఈ అభిప్రాయమునే వ్యక్తీకరిస్తూ శ్రీ సాధునిశ్చలదాసుస్వామీజీగారు శ్రీ విచారసాగరమున అధికారి లక్షణమును ఇలా చెప్పియున్నారు. హిందుస్థానీ దోహ :-

మలవిచ్ఛేప జాకే నహి,కింతు ఏక అజ్ఞాన। ఙ్ఞై చవ సాధన సహిత నర, సో అధికృత మతిమాన ॥

అట్లే, శ్రీ వేదాన్త బాలబోధములో శ్రీ పండిత పీతాంబరజీగారు గూడ చెప్పారు— హిందుస్థానీ దోహ:--

నాస్యో మల విక్షేప జిస,శేష రహ్యో అజ్ఞాన।సాధనచవ సంయుక్త జో, సో అధికారీ జాన॥

## గ్రంథ ప్రతిపాద్య విషయము

2. విషయము:- దీనికి "అభిధేయమని"గూడఅంటారు."శాస్త్రజ ప్రమా నివర్త్యాఽజ్ఞానగోచరోఽభిదేయః". ఏ శాస్త్రజన్య ప్రమాజ్ఞానముచేత నివృత్తియగుటకు యోగ్యమగు అజ్ఞానమునకు యే పదార్థము విషయమగునో, ఆపదార్థము ఆశాస్త్రమునకు "అభిధేయము"(విషయము)అనబడును.వేదాన్తశాస్త్రమును విచారము (శ్రవణాదులు) చేయగా కలుగు చరమవృత్త్యాత్మక అప్రతిబద్ధ (అహంబ్రహ్మాస్మియను) దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానముచేత నివర్త్యమగు ఆవరణవిక్షేపశక్తులుగల అనాద్యనిర్వచనీయ భావరూప (మూల) అజ్ఞానమునకు విషయమగు "జీవబ్రహ్మైక్యము" (వేదాన్తశాస్త్రమునకు) అభిధేయము లేదా విషయమగును.

శ్లో॥విషయః శుద్ధచైతన్యం జీవబ్రహ్మైక్యలక్షణమ్।

యత్రైవ దృశ్యతే సర్వవేదాన్తానాం సమన్వయః॥(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము-శ్లో.9)

"విషయో జీవబ్రహ్మైక్యం శుద్ధంచైతన్యం ప్రమేయమ్. తత్రైవ వేదాన్తానాం తాత్పర్యాత్". (వేదాన్తసారము)

ఏ జీవబ్రహ్మైక్యరూప శుద్ధచైతన్యము(పరబ్రహ్మము) సకలవేదాన్తములకు (ఉపనిషత్తులకు) సమన్వయముగా (తాత్పర్యముగా) తెలియబడుచున్నదో, ఆ "జీవబ్రహ్మైక్యమే" వేదాన్తశాస్త్రమునకు అభిధేయము, ప్రమేయము, లేక విషయము అనబడును.

## ప్రయోజన వర్ణనము

3. ప్రయోజనము:--"యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనమ్". ఏ పదార్థముయొక్క ప్రాప్తినుద్దేశించి సాధకుడు తత్ప్రాప్తిసాధన సంపాదనమునందు ప్రవృత్తుడగునో, అతనికి అది ప్రయోజనమనబడును.

శ్లో॥బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సన్తః ప్రాహుః ప్రయోజనమ్।

యేన నిఃశేష సంసార బంధాత్సద్యః ప్రముచ్యతే॥( స.వే.సి.సా.సం. శ్లో. 11)

"ప్రయోజనంతు తదైక్యప్రమేయగతాఽజ్ఞాననివృత్తిః, స్వరూపానందావాప్తిశ్చ. "తరతిశోకమాత్మవిత్" (ఛాం. 7-1-3),"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి "(ముం.3-2-9) ఇత్యాదిశ్రుతేశ్చ".(వేదాన్తసారము ).

దేనిద్వారా జీవుడు తత్కాలము(శీఘ్రముగా) జీవబ్రహ్మైక్యరూప ప్రమేయగత అజ్ఞాననివృత్తిద్వారా సర్వప్రకారముల సంసారబంధనములనుండి విడివడి స్వస్వరూప ఆనందమును పొందగలడో,అటువంటి "జీవబ్రహ్మైకత్వవిజ్ఞానానుభవము"నకే సత్పురుషులు (విజ్ఞులు)వేదాన్తశాస్త్ర విచారమునకు"ప్రయోజన" మని చెప్పుచున్నారు. ఈవిషయంలో "తరతిశోకమాత్మవిత్", "బ్రహ్మవేదబ్రహ్మైవభవతి" ఇత్యాద్యనేకశ్రుతులు ప్రమాణములు.

పరమపూజ్యులు పరమకారుణికులునగు శ్రీపండితపీతాంబరజీగారు "శ్రీవేదాన్తబాలబోధము" ప్రథమోపదేశము చివరలో ఈక్రిందివిధముగా అనుగ్రహించారు.

హిందుస్థానీదోహ:-- సర్వ అనర్థ నివృత్తి అతి। ప్రాప్తీ పరమానంద॥

సోఈ ప్రయోజన పరమ తిహి। సాధన బోధ అమంద॥

అవిద్యా తత్కార్యరూప స్థూలసూక్ష్మప్రపంచము మరియు దాని ధర్మములగు జన్మమరణములు,

కర్తృత్వభోక్తృత్వములు, ఆకలిదప్పికలు మొదలగు సంసారము సర్వదుఃఖములకు కారణమున్నందున "అనర్థమ"నబడుచున్నది. దీనియొక్క అత్యంతనివృత్తి మరియు పరమానందరూప బ్రహ్మప్రాప్తి–అను "మోక్షమే" ఈ గ్రంథమునకు పరమఫలము అనగా ముఖ్యప్రయోజనమున్నది.

1. "అన్యేచ్ఛానధీనేచ్ఛా విషయత్వమ్- ముఖ్యప్రయోజనత్వమ్ ".

ఇతర ఇచ్ఛకు ఆధీనముగాని (అపేక్షించని) ఇచ్ఛకు యేది విషయమగునో అది ముఖ్యప్రయోజనమ నబడును.

2. పరమప్రయోజనమునకు సాక్షాత్సాధనమగు అమంద=దృఢ; భోధ=జ్ఞానము (దృఢాపరోక్షబ్రహ్మజ్ఞాన ము) యేదిగలదో అది ఈగ్రంథమునకు "అవాంతర ప్రయోజనము"(గౌణప్రయోజన)మున్నది.

"అన్యేచ్ఛాధీనేచ్ఛావిషయత్వమ్ – గౌణప్రయోజనత్వమ్".

ఇతరేచ్ఛా అధీనమగు (ఇతర ఇచ్ఛను అపేక్షించు) ఇచ్ఛకు యేదివిషయమగునో అది గౌణప్రయోజన ము (అవాంతర ప్రయోజనము) అనబడును.

1.పురుషునికి యేఫలమును పొందాలను యిచ్ఛకలుగునో అది పరమప్రయోజనమునబడును(మోక్షము).

2.పరమప్రయోజనమునకు యేది సాధనమో అది అవాంతర ప్రయోజనమనబడును. (దృఢాపరోక్షబ్రహ్మ జ్ఞానము ).

## సంబంధ వర్ణనము

4. సంబంధము:- 1.అద్వితీయ బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించు వేదాన్త గ్రంథము ప్రతిపాదకమగును. జీవబ్రహ్మల ఐక్యము గ్రంథముచే ప్రతిపాద్యమగును. కావున, గ్రంథమునకు విషయమునకు ప్రతిపాద్య ప్రతి పాదకభావ సంబంధము గలదు. 2. అధికారి పురుషుడు మోక్షరూప ఫలమును లేదా గ్రంథాధ్యయనముద్వా రా మోక్షసాధనమగు బ్రహ్మాత్మైక్యదృఢ అపరోక్షజ్ఞానమును పొందును. కావున, అధికారి ప్రాపకుడనబడును. మోక్షము లేదా జ్ఞానము ప్రాప్యము అనబడును. అందువలన అధికారికి మరియు ఫలమునకు ప్రాప్య ప్రాప కభావసంబంధము గలదు. 3. "శ్రోతవ్యోమన్తవ్యోనిదిధ్యాసితవ్యః"(బృ.2-4-5&4-5-6) అనంటూ శ్రుతిమాత ఆత్మతత్త్వ విచారమును అధికారికి కర్తవ్యముగా బోధించినది. కావున, విచారము కర్తవ్యము (చేయదగినది). అధికారి పురుషుడు ఆచార్యులవారి ముఖారవిందముద్వారా జీవబ్రహ్మైక్యబోధకతత్త్వమస్యాది మహావాక్య ములను శ్రవణముచేసి, పిమ్మట మననము నిదిధ్యాసనముచేయు (విచారముచేయు) కర్తయగును. కావున, విచారమునకు మరియు అధికారికి కర్తృకర్తవ్యభావ సంబంధము గలదు. 4. విచారముద్వారా గ్రంథము జ్ఞాన మునకు జనకమగును. జ్ఞానముజన్యమగును. అందువలన గ్రంథమునకు మరియు జ్ఞానమునకు జన్యజనక భావసంబంధము గలదు. 5. జ్ఞానముద్వారా అజ్ఞానము నివర్త్యము(నాశ్యము,భాధ్యము)న్నది. జ్ఞానము నివ ర్తకము (నాశకము,బాధకము)న్నది. కనుక, జ్ఞానమునకు మరియు అజ్ఞానమునకు నివర్త్యనివర్తకభావసంబంధ ము గలదు. 6. మహావాక్యోపదేశమునుజేయు శ్రీగురుదేవులు బోధకుడగును. అధికారి (శిష్యుడు)బోధ్యుడగు ను. వీరిద్దరికి బోధ్యబోధకభావసంబంధము గలదు. 7. శ్రవణాదులు జ్ఞానమునకు సాధనములు. జ్ఞానము మోక్షమునకుసాధనమగును. అందుచేత, శ్రవణాదులకు మరియు జ్ఞానమునకు, అట్లే, జ్ఞానమునకు మరియు మోక్షమునకు సాధ్యసాధనభావ సంబంధము గలదు. ఇట్లే, యథా యోగ్యముగా సంబంధములు ఊహించు కొనవలెను.

సంబంధరూప అనుబంధ కల్పన చేయుటలో ఈ ప్రయోజనము గలదు. ఏ వస్తువునకు దేనితో సంబంధముండునో, ఆ వస్తువుయొక్క ఉపయోగము దానికి ఉంటుంది. ఉదా:- కులాలునికి(కుమ్మరివానికి) ఘటము(కుండ)తో సంబంధమున్నది. కావున, అతనియొక్క ఉపయోగము ఘటమునకున్నది. ఏ వస్తువుయొక్క సంబంధము దేనితో ఉండదో, ఆ వస్తువుయొక్క ఉపయోగము దానికి ఉండదు. ఉదా:- చక్షువుయొక్క సంబంధము వాయువుతో గాని, ఆకాశముతో గాని లేదు. రూపము గల వస్తువుల చేతనే నేత్రముయొక్క సంబంధము ఉంటుంది. వాయువులో మరియు ఆకాశములో రూపము లేదు. కావున, వాటితో నయనసంబంధము కుదురదు. కనుక, లోచనముయొక్క ఉపయోగము వాయువునందు గాని, ఆకాశమునందు గాని లేదు. అట్లే, గ్రంథమునకు మరియు బ్రహ్మమునకు పరస్పరసంబంధము లేనిచో గ్రంథమునకు బ్రహ్మమునందు గాని, బ్రహ్మమునకు గ్రంథమునందు గాని ఉపయోగమేమియును సిద్ధించదు. అట్లే అన్యసంబంధముల విషయములోగూడ తెలిసికోవాలి. ఇట్లు, పరస్పర ఉపయోగమునకు యోగ్యతగలరెండు పదార్థములకే సంబంధము సిద్ధించును. కాని, నిరుపయుక్త పదార్థములకు సంబంధము కుదురనేరదు. అందువలన, యోగ్యత లేకుండా సంబంధముయొక్క అసంభవ జ్ఞానరూప అర్థాపత్తిప్రమాణముచేత, ఆయా పదార్థములయొక్క యోగ్యతను కల్పన చేయుటయను అర్థాపత్తి ప్రమ కలుగుచున్నది. ఈ కారణము వల్లనే పరస్పరమునకు పరస్పరమునందు ఉపయోగనిశ్చయము కొఱకే ఆయా పదార్థములకు సంబంధమును కల్పనజేసి శాస్త్రములందు చెప్పబడినది. కాని, వేరు ప్రయోజనము లేదు.

ఈ ప్రకారముగా అధికారి, విషయము, ప్రయోజనము, మరియు సంబంధము- అను అనుబంధ చతుష్టయజ్ఞానముగల ప్రేక్షావత్పురుషుడే (వివేకియే) నిస్సందేహముగా, ఉత్సాహముతో శ్రవణాదులు చేయుటకు గ్రంథమునందు ప్రవృత్తుడగును. కావున, గ్రంథారంభమున అనుబంధ చతుష్టయ నిరూపణము అత్యావశ్యకమై యున్నది. కొన్ని గ్రంథములలో యీ అనుబంధ చతుష్టయ క్రమము వెనుక ముందులుగా గూడ చెప్పబడినది. భ్రమజెంద పనిలేదు. అనుబంధ చతుష్టయనిరూపణమునందే ముఖ్య తాత్పర్యము గలదని యెఱుంగవలెను.

శ్రీ ఆద్యగురు శంకరాచార్యులవారు "సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము" లో ప్రారంభమున ఇట్లు చెప్పియున్నారు.

శ్లో॥అస్యశాస్త్రానుసారిత్వా దనుబన్ధచతుష్టయమ్।
యదేవ మూలం శాస్త్రస్య నిర్దిష్టం తదిహోచ్యతే॥6.

శ్లో॥అధికారీ చ విషయః సంబన్ధశ్చ ప్రయోజనమ్।
శాస్త్రారమ్భఫలం ప్రాహు రనుబన్ధచతుష్టయమ్॥7.

అధికారి, విషయము, సంబన్ధము మరియు ప్రయోజనము- అనునీయనుబంధ చతుష్టయమును గ్రంథారంభమున తెలియపరచినపుడే ప్రేక్షావత్పురుషుడు (వివేకి, అధికారి) గ్రంథమునందు ఉత్సాహముతో నిస్సందేహముగా ప్రవృత్తుడగును. కావున, ఈ గ్రంథము వేదాన్త శాస్త్రమునను సరించినదగుటచే వేదాన్త శాస్త్రమునకు (ఉపనిషత్తులకు)చెప్పబడిన యనుబన్ధచతుష్టయమే యిచట చెప్పబడుచున్నది. పైన పేర్కొనిన నాల్గు అనుబంధములు శాస్త్రారంభమను ఫలమునకు నిమిత్తములని పండితులు వచించియున్నారు.అనగా, అనుబన్ధ చతుష్టయమును చెబితేనే శాస్త్రారంభము సఫలమగును. లేనిచో నిరర్థకమగునని తాత్పర్యము.